శ్రీ

# లక్ష్మీశృంగార కుసుమ మంజరి

ఇది

శ్రీమత్పరమహంస పరిపూర్ణానంద నాథుని

సంస్కృతకృతినుండి

సింహపురి (నెల్లూరు) వాస్తవ్యులు

బ్రహ్మశ్రీ దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారిచే

తెనిఁగింపఁబడినది.



చెన్నపట్టణము

1916.

సర్వస్వామ్యసంకలితము. ] [ వెల, 0-4-0.

శ్రీ కృష్ణదేవరాయ ఆంధ్ర భాషానిలయము,

విభాగము................

విభాగ సంఖ్య................

"శ్రీగురుచరణా స్మరణామ్
సంస్పృతి తపఖిన్న చంద్రమః కిరణామ్
మదుప ర్యవిరళ కరుణాం
విస్మృత నిజరూప దర్పణాం కలయే"

# విజ్ఞాపనము

పదియాఱేండ్లకు మున్ను దీనిఁ దెలిఁగింపంబూని యల్పాల్ప మ
య్యదనన్ వ్రాసితి, నంత జ్యోతిషమునం దావెన్క వేదాంతమం
దుదిత ప్రజ్ఞుఁడనై ప్రబంధ రచనోద్యోగంబుఁ జాలించితిన్,
దుదినందించితి నెట్లొ నేఁటికిది మిత్రుల్ చాలఁ బ్రేరింపఁగాన్. 1

మ॥ పదియాఱేఁడులు—నూఱు పద్యములు! భవ్యం బాశుధారైక సం
పద, యిట్లుండనలేన్ గవిత్వమని నవ్వంబోకుఁడీ మీర లె
య్యదియైనన్ బనియల్పమో ఘనమొ భాగ్యాయత్తమౌసిద్ధి, యు
య్యది మందమ్మగువాని కెట్లగు వడిన్ బ్రారంభ సాకల్యముల్?. 2

మ॥ అవధానాంత పరిశ్రమంబొదవె బాల్యంబంద, సంజీవన
ప్రవివాదమ్ముల లక్షణజ్ఞతయు నారంగల్గె; వేవేలు ప
ద్యవితానమ్ములు చెప్పితిన్ హితులకై; యట్లయ్యు భాగ్యోదయం
బవురా! యిర్వదియేఁడు లీలఘుకృతిన్ హాళిన్ దెనింగింపఁగాన్. 3

చ॥ గతజల సేతుబంధన మిఁకన్ దడవన్ బనియేమి వాని? ఫ
గతి తెఱఁగిట్టి దయ్యె మును, కాఁగలకాల మిఁకెట్టు లుండునో?
ద్యుతియు మనీషయున్ దఱుగుచుండె, నభీష్టగుమప్రబంధని
ష్ఠితి, కొనసాగునో? మఱుమఱీచియయౌనో? యెవం డెఱింగెడున్. 4

ఉ॥ కాన, భవిష్యదర్థ విముఖమ్మగు చిత్తముతోడ, నేఁటికే
నేనొనరింపఁగల్గిన దిదేపదివేలని యీ ప్రబంధమున్
బూని మదిష్టదేవునకుఁ బూర్ణునకిచ్చెద స్వేష్ట సంగ్రహీ
తానృత గోపవేషునకు నక్షయకీర్తికి విష్ణుమూర్తికిన్. 5

చ॥ అడుగుటకన్నమున్న ప్రణయంబొనరన్ గృతియెల్లఁ జూచి యొ
ప్పెడుమతి ముద్రణార్థమిడఁ బ్రేరితుఁడయ్యె గుణానురాగమే
ర్పడఁగ నభిజ్ఞుఁ డెవ్వఁడు దిరమ్ముగ లంకలపల్లి వంశ్యునిన్
గడు వినుతింతు నీకృతిముఖమ్మున వేంకట సుబ్బయార్యునిన్. 6

చ॥ ఘనులకునైన నొక్కయెడఁగల్గుఁ బ్రమాదమటన్న నాతెఱం
గున నవిమర్శశీలునకుఁ గొంకక కల్గుట చెప్పనేటికిన్
సునియత సౌహృదమ్మునన చూచెదరంచు భవత్కరమ్ములం
దునిచిననాఁడ నీకృతి, బుధోత్తములార! కృపన్ గ్రహింపరే!. 7

నెల్లూరు
15—2—16

సుధీవిధేయుఁడు.
దుర్భా సుబ్రహ్మణ్యశర్మ.

# వి జ్ఞా ప నా కు సు మ మ్

సుధాసింధో రంతర్వ్యటవిటపినః పల్లవపుటే
జగత్క్రీడాయాసా లసమనసమీశం సుశయితం
దృగంతే చుంబంతీం రహసి సుఖయంతీం స్వలలితైః
భజే సంవిన్నిద్రాం భవభృతి వినిద్రాం భగవతీం. 1

శ్లో॥ త్రిధాభిన్నాపూర్వం తదనుశతధాఽథ బహుధా
జగత్యాం క్రీడార్థం జనని! తవమూర్తిః పరిణతా
తథాప్యేకం తత్త్వం భవదరుణ పాదానుసరణైః
విదుఃపూతా స్త్వన్యేచకిత హృదయాస్తర్కితభిదాః. 2

శ్లో॥ పితాసౌమాతామే తనయ ఇతి బంధుస్సహాభవః
ప్రియేయంశత్రుస్తే సుహృదితి మనోమాత్రకలనైః
ప్రపంచంత్వంచాలీ నటనసదృశైః విస్మితదృశః
పశూన్ జంతూన్ కృత్వా భవకృతిభిః బధ్నాసివిపథే. 3

శ్లో॥ క్రియాః కుర్వంత్యేకే భగవతి! సుఖార్థం యతధియః
తథాధ్యాయంత్యేకే పరమపురుషోత్సంగనిలయే
ఉదాసీనాశ్చాన్యే శ్రుతిచరమ తాత్పర్యకుశలాః
శ్రయంతిత్వద్రూపం పర మనుపమం మంగళమితి. 4

# వి జ్ఞా ప నా కు సు మ ము



స్మృతి శిరస్వదంతరనటాగ్ర పలాశపుటమ్మునన్ జగ
త్త్రయరచనాదిచే నలసి కన్నుఁబరున్న విభున్ విలోచనాం
తముల స్పృశించుచున్ స్వలలితమ్ముల నెవ్వతె ప్రీతుఁజేయు న
య్యమలిన యోగనిద్ర, ఘనహారవినిద్ర, సమాశ్రయించెదన్. 1

చ॥ త్రివిధంబై, శతరూపమై, వివిధమై, క్రీడార్థ మూర్త్యస్థలిన్
ఘనదీయాకృతి పెక్కుచందముల సేవ్యంబయ్యె, నట్లైన నిన్
సువివేకుల్ పరికింత్రు తత్త్వ మొకఁడంచున్ ద్వత్ప్రసాదాఢ్యులై;
యవివేకుల్ చకితాత్ములై చెడుదు రియ్యర్థంబు శంకించుచున్. 2

మ॥ పితృమాతాత్మజ బంధు సోదర సుహృద్ద్వేష్యాదిభావమ్ము లు
ద్ధతసంకల్ప సముద్భవమ్ములును మృత్పాంచాలికాసన్నిభ
ప్రతిమానమ్ములటం చెఱుంగక పశుప్రాయాత్ములై యున్న లో
కతతిన్ సంసృతి పాశబద్ధమునుగాఁ గావింతు సర్వేశ్వరీ! 3

మ॥ భ్రమచేఁ దత్తదభీష్టముల్ పడయఁ గర్మధ్యాన నైష్కర్మ్య వృ
త్తములన్ గొందఱు సంశ్రయింతురయినన్ దత్త్వైక తాత్పర్య వి
త్తములత్యుత్తమ మంగళమ్మని సముద్యత్త్రాణకీనాకృతి
క్షములై యెంత్రుసుమీ, పురాణపురుషోత్సంగాగ్ర సంవాసినీ!. 4

శ్లో॥ విధాతా నిర్మాతా జనని! తవసాహాయ్య కలనాత్
విధుర్వా సంధాతా సకలజనతాం క్షేమమసకృత్
కపర్దీసంహర్తా భవతిహి భవత్యాశ్చరణతో
నజానే జంతూనాం పరమగతిదం మంగళపదం. 5

శ్లో॥ హ్రాదిస్మారంస్మారం మనసిజ కలాకారకలితాం
భజేత్త్వాంయో ధీరస్త్వనఘసభాగాస్య ఘటితాం
అనంగస్తం ప్రష్టుం హరమివ సశంకస్సువదనాః
స్మరాఘేనాస్తస్య ప్రపదముపయాంత్యాశు శరణమ్ 6

శ్లో॥ కరేవిత్తం, వక్త్రే సరసకవితా, సాధువదనా
గృహే సాధ్వీ, భక్తిస్త్వయిహృది, గురుస్తత్త్వకుశలః
సదాసద్భిస్సంగో బహుజనికృతాయా శ్చరణయోః
వరివస్యాయాస్తే ఫలమితిహిమన్యే సుకృతినాం. 7

శ్లో॥ శివాకారా నీలోత్పల సదృశదేహా ప్రథమతః
సురాన్భీతాన్త్రాతుం హరమనసి మోహంజనయసి
సుధాధారాదర్పం పరిహరసి భాషాకృతిధరా
సువర్ణాభాదీనానవసి శిశిరాపాంగనికరైః 8

శ్లో॥ త్రిలోక్యామేతస్యామవతివిపదో విశ్వజననీ
స్వభక్తానిత్యేత ద్వదతి నిగమానాం సముదయః
అతస్త్వత్కారుణ్యామృత ఘనరసే చాతకితధీః
కదావానైర్ఘృణ్యాశనిభయమిదం నాస్మరమహం. 9

శ్లో॥ త్వదాలంబం మత్వాహృది సకలకల్యాణనిలయం
మయాగర్వేణాహం కథ మరినికారాస్పదమితి
ముహుర్నీచైః దృష్టేపరిభవతి దుష్టేరిపుగణే
ఉదాసీనాత్వంచే దహమివకదర్థః కథయకః. 10

ఉ॥ సరసిజగర్భ, శార్ఙ్గధర, చంద్రకలాభరణుల్, జగత్త్రయా
భరణవినాశముల్ సలుపు పాండితికిన్ గతమైనయట్టి నీ
చరణయుగమ్ముగాక జనసంతతి కన్యముగల్గునే? ప్రభో
త్కరిపదవీ ప్రదర్శకము, గావున నిన్ వినుతింతు భార్గవీ! 5

చ॥ స్తనజఘనాస్యభాగ వరసంపదఁ గామకళాకృతిన్ దన
ర్చిన నినునాత్మ నెవ్వఁడు భజించు, స్మరుండతఁడన్ నిటాలలో
చనునిబలెన్ గనుంగొన పశంకుఁడవున్ దదధీనలింతు లా
తని శరణమ్ముఁగోరి ప్రపదమ్ముల వ్రాలుదురమ్మ! భార్గవీ! 6

చ॥ కరమునవిత్త, మాస్యమునఁ గవ్యకవిత్వము, గేమునన్ గుణో
త్తరయగు నుత్తమాంగన, యెదన్ నినుఁ బేరుకొనందలంప్రు. సా
ధురతిపతిమ్ము, తత్త్వనిరతుండు గురుండు, ఘటిల్లు నెల్ల భా
స్వర బహుజన్మసాధిత ఘనచ్చరణార్చనమున్ ఫలాకృతుల్ 7

మ॥ నరనీలోత్పలదేహవై సురలఁ బ్రోవందొల్త ముక్కంటికిన్
స్మరవేగమ్ము ఘటించి తాపయిని భాషామూర్తి వై చున్ సుధా
స్ఫురణంబున్ గవికోత్తిఁ జాలితివి, యిచ్చో నేఁడు స్వర్ణాభవై
వరుసన్ జల్లనిచూడ్కి నాశ్రితులపై వర్షించె దిష్టార్థముల్. 8

మ॥ శ్రితులం బ్రోచు వెతల్ దొలంచి త్రిజగత్ శ్రీమాతయంచున్ ద్రయీ
వతముల్ చాట, భవత్కృపాఘనరసేచ్ఛా చాతకవ్ బుద్ధినై
స్తుతి సేవించితిఁగాని యెన్నఁడును జింతింపన్ గటోరాతని
ప్రతిమంబైన త్వదీయ నిష్కరుణభావంబేను, సర్వేశ్వరీ! 9

మ॥ అలఘుప్రాభవహేతు భూతనుగునీ యాలంబమున్ నమ్మి తే
త్తుల పార్వవలంతి నౌదునని యెంగున్ వారిపైఁ డాయు నా
వలనన్ నీవు కృపాప్రపూర్తి యిడవేన్ వ్యర్థుండనై పోనె దా
యలలో? సేవను నిట్లొనర్పఁదగునమ్మా! భక్తచింతామణీ! 10

## విజ్ఞాపనాకుసుమమ్

శ్లో॥ నిధేస్త్వం రత్నానాం మహితతనయా సాగరపతేః
వదాన్యానాంమాన్యా త్రిభువనవిభో ర్భాగ్యమహిషీ
సువాసా శ్రీనాసే త్వమితిచ సత్యాణ్ణోస్త్రిజగతః
మహామాయాభావో భగవతి! తవాయం వివిదితః. 11

శ్లో॥ త్వదక్షిప్రక్షేపః క్షణమపిచ యస్మిన్ క్షితితలే
తదక్షిప్రత్యక్షాచ్యుత పదసమాసాదనపరం
విజానీతే కించిన్నిజవిభవసంపన్నముదా
సుహృత్స్వర్గే బంధూనపి సృజతి సమీహా మహారహః 12

ఇతి విజ్ఞాపనాకుసుమమ్.

మ॥ జనకుం డద్భుతరత్నధాముఁడనియున్, స్థానంబు శ్రీమందిరం
బనియున్ భర్తజగత్ప్రభుండనియు, నిన్నర్థించినన్ గోర్కు లొ
య్యానఁ జేకూరునటంచు నెంచితిని, మాయాZ భావయుష్మత్ప్రవ
ర్తనమొక్కింత యెఱుంగనైతిని మహారాజ్ఞీశిరోరత్నమా!. 11

చ॥ ధరణి, భవత్కటాక్షలవ దర్శనమెవ్వనికిన్ క్షణార్ధమేన్
దొరకు నతం డరాతిచయ దుర్భరగర్వ భరాపనోదియై
హరిపద బద్ధదృష్టియగు చాత్త రమా ప్రమదమ్మునన్ బథాం
తరము గనుంగొనందు; విహితత్త్వము బాంధవమున్ నఁటల్కొనున్. 12

ఇది విజ్ఞాపనాకుసుమము.

# ధ్యానకుసుమమ్

కృశామధ్యే, పృథ్వీజఘనభువి, పీనాకుచతటే
నితంబే యా గుర్వీ, చకితచకితా చక్షుషిచ యా
ప్రసన్నాస్యే, వాచిప్రకటిత మనోజ్ఞామృతరసా
లసాయానే సా విర్భవతు మమఖేదం శమయితుమ్. 1

శ్లో॥ ధయంతీ దారిద్ర్యాభిధ విబుధఘర్మ శ్రమమథో
నయంత్యంహః పాంసుం సపది మదయంతీభ్య మధుపాన్
దిశంతీసంభద్రం మధురనినదంతీ మణినిధేః
సుధావీచీః కాచి త్కనకరుచి రావిర్భవతునః 2

శ్లో॥ వర స్మేరాపాంగ ప్రసదమిత వాత్సల్యసుధయా
ప్రపంచం సించంతీ కరకలిత పీయూషకలశీ
వివస్వద్రశ్మి ప్రద్యోత కనకడోలాయిత సరో
రుహారోహా యోషిత్ప్రశమయతు దైన్యం మనసి నః. 3

శ్లో॥ మహాహర్మ్యేమేరౌ సురభిళ మరుత్పుష్పశయనే
సుధాబిందు స్యందద్వైందవమణి చతుష్కాంతరగృహే
మృదూత్సంగాసీనా ముదితయతి యా వైణికరవైః
ప్రియం వంశీలోలం దిశతుకుశలం సా పరతనూః 4

శ్లో॥ పటీరద్రుం కంచిద్వలయితవతీం వ్యాళయువతీం
శ్వసంతీం విశ్లేషానల మసహమానామివముహుః
శనైర్యానే నాంతర్నళినవనమార్గాదుపగతాం
సుధాంభోధిం పత్యాసహ విహరమాణామపినుమః 5

# ధ్యానకుసుమము

చెలువొనరన్ నితంబ జఘనస్తన యానములన్, విలోచనో
త్పల, నవలగ్న వక్త్రముల గుర్వియుఁ బృథ్వియుఁ బీనయున్ గర
మ్మలసయు భీతయున్ విరచితామృతయున్ గృశయున్ బ్రసన్నయై
యలరులతాంగి తాపముల నార్పనిటన్ బొడసూపుఁ గావుతన్!. 1

శా॥ శ్రీమద్భృంగము లుల్లసిల్లఁగ, విపశ్చిద్దైన్య ఘర్మశ్రమల్
నామంబేద, నఘౌఘ పాంసుపటలీ నాశమ్ముగావింపుచున్
వామస్థానముతో సువర్ణరుచితో భాసిల్లు రత్నాకరో
ద్ధామేయామృతవీచి యొందు, శుభదంబై ప్రోలఁ జూపట్టుతన్. 2

చ॥ దరవికసత్కటాక్ష నిరతప్రవదిష్య దయామృతైక వి
స్ఫురణఁ బ్రపంచమున్ వడపుచున్ గలితామృత కుంభహస్తయై
హరికరమాల్యసంభరిత హారిసరోజ సువర్ణడోలికా
నిరతి నెసంగు దేవతరుణిన్ సిలుగుల్ దొలగింపఁ గొల్చెదన్. 3

చ॥ సురగిరి హర్మ్యసీమ, సుఖజొబ్బిలు చందురురాతి గీములో
సురభిళ దివ్యపుష్ప పరిశోభిత శయ్య, మృదూరువాసయై
నగమురళీ వినోదియగు ప్రాణవిభున్ స్వవిపంచికాస్వర
స్ఫురణను బ్రీతుఁజేయు సురసుందరి మాకు శుభమ్ములీవుతన్. 4

ఉ॥ గంపపుఁజెట్టు మట్టికొని గాఢవియోగ శిఖిప్రసక్తినాన్
సాంద్రత నార్చుచున్ గమలషట్కపరిస్ఫుర దంతరధ్వమున్
వంపగలిన్ గ్రసించి మునమార సుధాబ్ధి సకాంతలైయె సుకాం
తిం గలకించు చక్రితరుణీమణికిన్ నరముల్ మొగిడ్చెదన్ 5

శ్లో॥ నభోభ్రాజన్మధ్యాం సుతలపదపద్మాం శుచిముఖీం
సుధారోచిర్భాస్వత్ప్రసృతినయనాం సుశ్రుతిదిశాం
హరిప్రాణేశానీ మమల సుమనోధామశిరసం
విరాజద్దివ్యాంగీం గిరి కుచభరాం కామపి నుమః 6

శ్లో॥ గురుంశైలాత్తూలం గిరి మపిచ తూలాల్లఘుతరం
తృణం మేరుం మేరుం తృణమివసమర్థారచయితుం
నిధిః కల్యాణానాం నిరవధిచిదానందలహరీ
హరేరంతర్వ్యాహిన్యవతరతు తాపం శమయితుం. 7

శ్లో॥ ధ్యాయామికాంచి దమృతాంశు సహోదరాస్యాం
శ్రీదేవతాం శ్రితమనోరథ పారిజాతాం
ఫుల్లారుణాంబురుహ సన్నిభపాదపల్ల
వారుణ్యా పూరశమితాశ్రిత హృత్తమస్కాం 8

శ్లో॥ ధ్యాయామి కంజశరకారణ కల్పవల్లీం
కంజాతకోరక సమన్విత కంజపాణిం
కంజాననాం కనకకంజ గృహాంతరస్థాం
కంజేక్షణాం ధవళకంజదృగుత్పలాక్షీం. 9

శ్లో॥ కాశ్మీరపత్రరచనాంకిత గండపాళిం
కస్తూరికాంచదళికాం కుటిలాలకాళిం
శ్రీకేతకీ కుసుమహాసి దరస్మితాస్యాం
నాళీకజన్మజననీం నతిభిశ్శ్రితోస్మి. 10

శ్లో॥ ధ్యాయామిభూరిభుజమంజరికా విరాజ
ద్దోర్వల్లరీం గతిరణన్మణి నూపురాంఘ్రిం
నాసాంచలోచ్చలిత మౌక్తికరత్నకాంతి
న్యక్కారిమందహాస నిమ్నకపోలభాగాం. 11

చ॥ గిరికుచమండలిన్, శుచిముఖిన్, సుశోభనోత్తమాంగ, సుం
దరగగనావిలగ్న; నమృతచ్ఛవిభాస్వదనూన నేత్రపు
ష్కర, సుతలాంఘ్రి సుశ్రుతి దిరన్, హరిజీవితనాయికన్, విప
ద్ధరణచణన్, విరాజదమలాంగి నొకర్తు దలంతు నాత్మలోన్ 6

మ॥ తృణమున్ మేరువు మేరువున్ దృణము నద్రిందూదిగా దూదిలో
నఖనయ్యద్రిఁ జేయు నేర్పునసి జ్ఞానానందపూర్ణస్వరూ
పిణియున్ భద్రచయాలవాలయును నా పీతాంబరాంతస్తరం
గిణి చూపట్టుతనిండు మానకమునః ఖేదంబుఁ బోఁద్రోచుచున్ 7

మ॥ అమృతాభీషు సహోదరాననయుఁ, ద్రైస్వర్యాత్రాతత్పటూస్వరణా
క్రమకల్యాగనువల్లియున్. వికసనారంభారుణాంభోరుహ
భ్రమకృన్మోహన పాదపల్లవయుగ ప్రద్యోతిపూర్ణైకసం
శమితస్వాశ్రితపుత్తమస్కాయగుయోగున్ గొల్తు శ్రీదేవతన్ 8

వసంతతిలక॥ కంజేషు హేతుశుభ కల్పలతన్ సతంతున్
గంజాతసూత్న కలికాయుత కంజపాణిన్
గంజాననన్ గనకకంజగృహాంతరస్థన్
గంజేక్షణన్ ధవళకంజ దృగుత్పలాక్షిన్ 9

మ॥ అలకాంచన్మృగనాభికా తిలకయున్, వ్యాలోలవక్రాలకా
వలియున్, శ్రీకరకేతకీ కుసుమ శోభాహాసి మందస్మితో
జ్జ్వల దాస్యాబ్జయుఁ, గుంకుమాంకమకరీ భాస్వత్కపోలాంచల
స్థలియున్ బద్మజుఁగన్న తల్లియును నా తత్వాంగికిన్ మ్రొక్కెదన్ 10

మ॥ గతిశింజన్మణి నూపురాంఘ్రియు, మనోజ్ఞస్వర్ణదోర్మంజరీ
నుతదోర్వల్లియు, నాసికాంచలచల న్ముక్తాఫలశ్రీ విరా
జితమందస్మితనిమ్నగండయుగయున్, జేటీభవన్నిర్ఝరీ
కృతసంప్రేమవచస్సుధారసయు నా శ్రీదేవి ధ్యానించెదన్. 11

శ్లో॥ ధ్యాయామి కామపి సుషుప్తిగతిమతల్లీం
శైరీషపుష్ప సుకుమార శరీర వల్లీం
మల్లీ స్రజాకలితాక్రిత కేశవల్లీం
హాల్లీసలాస్యరసికా మమరాంగనాభిః 12

శ్లో॥ ధ్యాయామి మన్మథ ధనుర్వలయాప్త చిల్లీ
వల్లీవిలాస వితతీకృత విశ్వవల్లీం
మల్లీలతాంతకృత కందుక కేళిలోలాం
వల్లీతనూభి రజజంగమ హేమవల్లీం. 13

శ్లో॥ ధ్యాయామి నారద పురోగ తపస్విసేవ్యాం
నారాయణీం నతవిపత్పరిహారిణీం తాం
చింతామణిం స్తుతవదభీష్టఫలప్రదానే
కాంతామణిం భువనభర్తు రహం పురాణీం. 14

శ్లో॥ యామున్మనీం ప్రశమనీం భవకల్పనాయా
స్సంచింతయంతి మునయస్సహసాశ్రయామి
శ్రీకారహర్మ్యతలవాసిసు వాసినీం శ్రీ
సౌదామినీం స్వజన దివ్యపయస్వినీం తామ్ 15

శ్లో॥ ధ్యాయామి కామపిఖిలం పరమేశ్వరస్య
సంకల్పతో నిఖిలదామఖిలం సిసృక్షోః
సర్వత్రగామపి సభాగ్యజనైకలభ్యాం
లభ్యేతరాం విధిశతైరపి దుర్విపాకైః 16

శ్లో॥ నిద్రాపదేనచ స్వప్నానాం సతరాం నిసర్గాం
కించిజ్జగత్ప్రతిభయా ప్రతిభాసమానాం
తుర్యాంకణస్ఫుర దకృత్రిమచారుగాత్రీం
అంతఃపురస్త్రియ మహర్నిశమాశ్రయామః 17

చ. విరిసెనపూలకుం బ్రవవిధింపఁగఁ జాలు శరీరవల్లితో
సురగని మల్లెపూసరుల శోభిలు నంజెడచుట్టతోఁ బురం
దర పురసుందరీ రచిత నాట్యవిశేష సమీహితాత్మయై
హరుసముగొల్పు వేల్పుజవరాలి నొకర్తుక నాశ్రయించెదన్. 12

చ. భువనజిగీషుహా స్మరుని పుష్పధనుర్వలయంబు మాడ్కిఁగ
న్గవ నలరించు భ్రూవిలసనమ్ముల విశ్వలతన్ వెలార్చుచున్
యువతులతోడి కుంద కుసుమోజ్జ్వల కందుక కేళిలోలయై
చవులు కడుంబొనర్చు నొకజంగమ హేమలతన్ నుతించెదన్. 13

ఉ. శ్రీయుతనారదాది ముని బృందశరణ్యయుఁ బుణ్యభక్తసం
స్థాయవిచింతితార్థ దివిషన్మణియున్, వికచారుణాబ్జ ప
ర్యాయమనోజ్ఞపాణియుఁ బురాణియునౌ జగదీశురాణి, నా
రాయణి లోకశోకపరిహారిణి, మాకుఁ బ్రసన్నయయ్యెడున్. 14

ఉ. ఏరమణిన్ మునుల్ భవములేర్చెడు నున్ననిగాఁ దలంతురో
ధీరనికామనిర్వపణ దివ్యపయస్వినియున్, దటిల్లతా
కార, సువాసినీకులశిఖాభరణమ్ము, సిరిన్ స్మరింతు శ్రీ
కార సువర్ణహర్మ్యతలకల్పిత మంగళ దీపికాకృతిన్. 15

చ. భువనములన్ సృజింపఁ దలపోయు ననంతునకున్ సమస్తవ
స్తువు లొడఁగూర్చు చెల్లెడల శోభిలుచున్ సుకృతైకలభ్యయై
భవములు నూటికైనను నభాగ్యులకున్ బొడసూపరాక కాం
తివెలయు నొక్కచొక్కపుఖనిన్ వినుతింతు నభీష్టసిద్ధికిన్. 16

మ. కన, నిద్రాపటయుక్తిచే జనులకున్ గన్పట్టఁగా రాక, చ
క్కన నొక్కింత జగత్ప్రతీతిని గనంగానొప్పి, తుర్యస్థలీ
కనదత్యంత మనోహరాంగలతయై కాంతిల్లు నంతఃపురాం
గన నొక్కర్తుక నాశ్రయింతు; మదఘౌఘంబెల్ల నింకింపఁగాన్ 17

శ్లో॥ ధ్యాయామి కాంచిదమరీం కరపల్లవేన
చిన్ముద్రితాం చిదచిదేకరస స్వరూపం
పద్మాసనే శ్రితజనాన్ ప్రతిబోధయంతీం
స్థిత్వార్ధ నిద్రిత మనోహర పక్ష్మలాక్షీం. 18

శ్లో॥ ధ్యాయామికామపి దృగుత్పల కాంతి పుంజైః
నాసామణిం విదధతీం హరినీలనీలాం
బంధత్రయాభ్యసన కేళివిజృంభమాణ
కుంభస్తనాగ్రయుగళీ దళితోరుహారాం. 19

శ్లో॥ నిస్తంద్రమానముని మానస సార సాంత
ర్వీథీ వికస్వర మనోహర నాసనా యా
ప్రాణేశ్వరీ భగవతోనుచరీ పరీవ
త్త్యైనాంచకోరనయనాంశరణం వ్రజామి. 20

శ్లో॥ మాయావతో భగవతో జగదూర్ణనాభేః
యాసాక్షిణీ విజయతే త్రిపురా పురాణీ
సర్వేశితు స్సకలలోక కుటుంబినీంతాం
ఆద్యాం హ్యాదిప్రియతమా మనుసందధామి. 21

శ్లో॥ ధ్యాయామికాంచిదపి చిన్మయతత్త్వవల్లీం
వైరాగ్యపల్లవరసజ్ఞ సుధీపికాళిం
ఆనందపుష్పరసలాలస యోగిభృంగాం
మోక్షాభిధానఫల నందితసుజ్ఞకీరాం. 22

శ్లో॥ దోగ్ధ్యన్వహం స్వజడధాతు చకోరకేభ్యో
యాచిత్సుధాం వికచచిన్మయచంద్రరేఖా
ధ్యాయామితాం సుమనసామనిశం సమూహై
రాస్వాద్యమానతనుమ ప్యతనుస్వరూపాం. 23

మ॥ శతపత్త్రంబుల సంజనాఁగనుల నీక్షాశీలనంబొప్ప, సం
శ్రితపద్మాసనయై కరస్థల లసచ్చిన్ముద్ర చే, భక్త సం
హతికంహాశ్యమనమ్ముగాఁ జిదచిద్వైక్యాకార విజ్ఞానముల్
ప్రతిబోధించు సురాంగనాతిలకమోర్తం జేర్తు హృత్పీఠికన్ 18

శా॥ శ్రీసంపూర్ణ దృగుత్పల ప్రబలరోచిఃపుంజ సంవ్యాప్తిచే
నాసామౌక్తిక మింద్రనీలమణిగా నల్వొంద, బంధత్రయా
భ్యాసోజ్జృంభ దురోరుహాగ్రయుగళీ ప్రక్షిప్తహారాళియై
యేసీమంతినిగాంతి సూపు మది నాయింతిం బ్రతిష్ఠించెదన్. 19

చ॥ ఎవతెయతంద్రమౌన మునిహృజ్జలజాంతర వీధికామిళత్
ప్రవిమలవాసనాకృతి, పరాత్పరుఁడున్ బరమేశుఁడైన కే
శవునకు నేలతాంగి సహచారిణియున్ హృదయేశియౌఁ బయో
ర్ణవతనయన్ జకోరనయనన్ శరణంచు సమాశ్రయించెదన్. 20

ఉ॥ మాయనుగూడికొన్న పరమాత్మునకున్ జగదూర్ణనాభికిన్
జాయయు నిర్భరప్రియయు సాక్షిణియున్ దరశాక్షియేర్త? యా
మ్నాయశిఖావిహార చరణద్వితయన్, ద్రిపరన్, బురాణి, నా
రాయణి నాశ్రయింతు నిఖిలాద్య సమస్త జగత్కుటుంబినిన్. 21

శా॥ వైరాగ్యాహ్వాయ పల్లవైకరసిక ప్రాజ్ఞౌఘ పైకమ్ము. ని
ష్పారానంద వినూత్నపుష్పరస చంచద్యోగి భృంగంబునై
యారూఢామృత సత్ఫలప్రముదితోద్యద్ధీరకీరాళితో
నారా! చిన్మయతత్త్వవల్లి యొకఁ డీడ్యమ్మయ్యె మాకియ్యెడన్ 22

చ॥ దయవెలయన్ స్వకీయజడధాతు చకోరములన్ గుణించి యా
వ్యయముగఁ జిత్సుధన్ బిదుకు, నన్వహమున్ సుమనః ప్రతాన పీ
తయు, నతనుస్వరూపయగు దాని; సచేతన చంద్రరేఖ, నెం
తయు మది సంస్మరింతు శుభదాత్రి, నిరంతర విస్ఫుటాకృతిన్. 23

శ్లో॥ సంవిన్మయైః ప్రథమత స్తు సముద్ధరంతీం
సంపన్మయై రపి పునః పరిపాలయంతీం
బ్రహ్మాండకాండ మఖిలం స్వకటాక్షకాండైః
కాంచిన్మరాళగమనాం మనసా శ్రయామి. 24

శ్లో॥ యా మున్మనీచరమభాగ విరాజమాన
బిందూపరిస్థ పరతత్త్వ మితీరయంతి
శ్రీసుందరీ హృదిహరే స్సుఖ శాయినీసా
సందర్శనార్థ మిదమిచ్ఛతు వందనం మే. 25

శ్లో॥ సందర్శయాశు సకలేశ్వరి! సుందరాంగం
మందస్మితం మదన పౌరుష మూలహేతుం
మాంగల్యకంద మరుణం కృపణాన్ పునానం
కారుణ్యత స్తరుణతానిధి మంబుజాస్యం. 26

శ్లో॥ మాతా భవత్యనుగతా నియతా మమైకా
హైయ్యంగవీన హృదయా హృదయా కిమర్థం
పీత స్త్వదేకశరణస్య కి మస్యజంతోః
దుష్కర్మ ఘర్మ నికరేణ భవత్కృపాబ్ధిః 27

శ్లో॥ దృష్ట్వాప్యకించన మముం పదయోః పతంతం
జ్ఞాత్వాప్యనన్యగ ముదాసిత వత్యసీత్థమ్
నాథాసతీ సదయ సేయమి తావకోసౌ
నశ్యే దమాతృశిశువ ద్విలపన్ నృకీటః. 28

శ్లో॥ శ్రాంతాసికిం? స్వపిషికిం? పరచింతితాసి?
ఛన్నాసికిం? కలివశాద్భువనం జహాసి?
ఉచ్చైస్స్వవై రసకృదార్త జనేన హూతా
త్యాకర్ణ్య నాభయవచః ప్రదదాసి మాతః. 29

చ॥ తొలుతఁ దమోనిమగ్నమగు తోయజజాండము చిన్మయమ్ములై
వెలయు కటాక్షకాండముల విశ్రుతబుద్ధి సముద్ధరించి యా
వల సరమమ్ములై తగునపాంగ మరీచులఁ బ్రోచునేర్త? య
య్యాళికచ; హంసగామిని; మనోబ్జమునన్ విహరించుఁ గావుతన్. 24

ఉ॥ పరమును లున్ననీచరమ భాగమునన్ గనుపట్టు బిందువున్
దొరసిన తత్త్వరూపమని తొయ్యలి నెవ్వతె సంస్మరింతురో
హరిహృదయైకశాయిని, రమాంగన, వందనమిద్ది యాత్మసుం
వర శుభరూపదర్శన విధమ్మునకంచుఁ దలంచుఁ గావుతన్. 25

మ॥ కనదంభోజ నిభాస్యమై, యరుణమై, కందర్ప దర్పైక వ
ర్ధనమై, మంగళమూలకందమయి, యర్ధస్మేరమై, నవ్య యౌ
వనసంపత్తియు లోకపావన సురూపస్ఫూర్తియున్ మూర్తిఁ గై
కొని నట్లుండు త్వదంగవల్లికను మాకున్ జూపు సర్వేశ్వరీ!. 26

ఉ॥ తల్లివియయ్యు నుద్భవశతమ్ములనుండి, నవోద్ధృతమ్ముతో
నుల్లసమాడు హృత్సరణి యొప్పియు, నియ్యెడ నిర్దయాత్మ వౌ
టెల్ల విచిత్ర; మారయఁ ద్వదేకగతిన్ దగునాదుపాప ఘ
ర్మోల్లసనమ్ము తావక కృపోదధిఁ ద్రానఁగఁబోలు భార్గవీ! 27

చ. అనితరభక్తియుక్తుఁడు, ననన్యగుఁడున్, భవదంఘ్రిపద్మపూ
జనరతుఁడైన యీజడునిచాయ దయన్ బ్రకటింపవైతివేన్
జననికి దూరమౌ శిశువుచందమునన్ గరమీన్నకీటకం
బనుపమ దుష్టకష్టముల కాస్పదమై చెడునమ్మ! భార్గవీ! 28

చ॥ వినివిసుగెత్తెనో? మనసు వేఱెడనుండెనొ? నిద్రయానొ? వం
చన యొనరించెదో? కలివశమ్మున నిజ్జగమున్ ద్యజించితో
యనుచుఁ దలంతుఁ; గానియెడ నార్తనిచేఁ బలుమారు హూతవై
విని యభయప్రదాన మొసవింపమికిన్ గతమేమి? భార్గవీ!. 29

శ్లో॥ చక్రేశతాం నహి వృణోమి ధనేశతాంవా
యాచే నమేరు మమరేశ్వర రాజ్యలక్ష్మీం
దేహ్యంబ! దర్శన మభీష్ట్వపాంగ సంగాత్
కింను ప్రియం తవజనస్య నవేత్సికింవా? 30

శ్లో॥ శ్రీమత్యహో శ్రితజనం సముపేక్షసేకిం?
ఖిన్నేషు దేవి! సదయాః ఖలు సత్త్వశీలాః
సత్త్వం త్వదీయమితి సాధుజన ప్రవాదం
పాతుం త్వమిచ్ఛసి నహోతు ముదాద్యమాతః 31

శ్లో॥ త్వదీయం యద్యస్తి ప్రకటితదయం మేరుశిఖరే
భవద్భక్తాఘౌఘ త్రుటనపటుపాండిత్యఘటితం
హృషీకేశస్యాపి ప్రభవిత మహో మోహమ్మషిభిః
విభావ్యంరూపం నప్రకటియసి కిం తన్మనుపురః. 32

ఇతి ధ్యానకుసుమమ్

ఉ॥ ఇమ్మన మేరువున్; దివిషదీశ్వరు రాజ్యరమావిభూతియున్
దెమ్మన; విశ్వధాత్ర్యధిపతిత్వ సమున్నతియేన్ ధనేశ్వర
త్వమ్మదియేని నిన్నడుగ, దర్శనమిమ్ము, భవత్కటాక్షసం
గమ్మునకన్న త్వజ్జనుని కన్యము కాంక్ష్యము లేదు; భార్గవీ!. 30

చ. కొలిచెడి వారిఁ జేవిడువఁగూడునె? సత్త్వగుణప్రపూర్ణులై
యలరెడి వారలెందు విపదన్వితులందుఁ గృపాళువుల్ గదా!
యిలపయి సాత్త్వికప్రకృతి వీవను సాధుజన ప్రవాదమున్
నిలుపుకొనంగఁ గోరిక జనించిన నన్ గృపఁజూడు భార్గవీ!. 31

ఉ. ఆశ్రితకిల్బిషౌఘ దళనాధికమై. ఋషిభావ్యమై, హృషీ
కేశునికేని మోహమెనయింపుచు. మేరుమహీధ్రరాట్శిఖా
భ్యాశమునందు నీకొకశుభాకృతి యుండుట నిక్కమేని, యే
లా? శరణార్థికట్టెదుట నయ్యది చూపవునేఁడు భార్గవీ!. 32

ఇది ధ్యానకుసుమము.

# ఆ వి ర్భా వ కు సు మ మ్

క్షీమాకాశః కాశైః వికసితవికాసః కిముర్ఝురీ
పయః పారావారాత్పతతి కిమురాశిశ్శశిరుచాం
తరంగాః కింగాంగాః స్మరకుముదవాపీ సురవధూ
పరీహాసశ్రేణీ కిము లసతి భాసాం సముదయః. 1

శ్లో॥ ఇదం కించిజ్జ్యోతి స్తిమిర పటలాక్రాంత ముపరి
ప్రసన్నేం దోర్లేఖా హరిమణిఘృణి శ్శోణితమణిః
భపజ్కార్వాహారః కిసలయశయాః కింకిముపుమాన్
కురంగీదృ క్కింవా స్ఫురతి సురవల్లీ తనురితి. 2

శ్లో॥ అసోకాచిద్వల్లీ కచతి కదళీకాండకలితా
దళం నైయగ్రోధం ముకుళయుగళీ సారసమయీ
తిలస్యైకం పుష్పం కుశలయుయుగం బైంబికఫలం
తదత్రాసర్వజ్ఞో తనురవతి బీజం కిమపివా? 3

శ్లో॥ క్షణంనీలాzనీలా తదను ధవళాత్యంత ధవళా
తతస్తప్తస్వర్ణారుణ ఘుసృణరోచిః పటలినీ
అవృశ్యామధ్యే సా వుపరి పటుష్పశ్యా కమలినీ
కుసుంభాంతశ్చేలా సితకుచదుకూలా విలసతి. 4

శ్లో॥ జగన్నీల చ్ఛాయంవిరచయతి నీలం వపురిదం
సుధాధారావర్షం కిరతికిము గౌరం వపురిదం
ఇదం రూపం శోణం హ్యరుణయతి లోకాణ్ కిమితిచ
క్షణం ముగ్ధం కించిచ్చకితయతి మాం హ్లాదయతిచ. 5

# ఆ వి ర్భా వ కు సు మ ము

తెల్లంబువ్వుల నుల్లసిల్లు గగనశ్రీయో; సుపర్వాపగా
కల్లోలావళియో, సురీహసన రేఖాశ్రేణియో. దర్పకో
త్ఫుల్లాచ్ఛాంబుజవాపియో; విధురుచ ప్రోద్యత్పయోరాశియో
యుల్లోకంబు విభా సమూహమిది యోహో! చూడవ్రేఁగయ్యెడున్. 1

మ॥ ఇరులున్, జెంతశశాంకమండలము, నం దింద్రాక్ష నీలద్యుతుల్
దరిసే లోహితకమ్ము, తేజమిది చిత్రంబచ్చోఁపన్ దారకో
త్కరమో! హారమొ! పాణిపల్లవములున్ గన్పట్టుఁ; దన్వంగియో!
పురుషుండో! సురవల్లిఁబోని యిది పువ్వుంబోఁడి తథ్యమ్ముగాన్. 2

చ॥ అనఁటులు కాండముల్; పటమయమ్ముదళంబు. కువద్వయమ్ము ను
వ్వును సుమముల్; సరోజయుగి పొల్పగు మొగ్గలు, పండుబైంబికం;
బనిశము తత్ఫలాప్తి నిఖిలార్థవిదుం; డతనుండు త్రాత, యి
య్యనుపమచిత్రవల్లికకు నాదియనందగు బీజమెద్దియో! 3

మ॥ తొలి నీలమ్ము, వినీల మాపయినిఁ: దోడ్తో నచ్ఛ మత్యచ్ఛ; ము
జ్జ్వలసంతప్త సువర్ణకుంకుమ రుచి ప్రాగ్భార మాపైఁ, బ్రకా
శిలు నూర్ధ్వమ్ము; నదృశ్యమధ్య, మరుణశ్వేత ప్రభాంతర్బహి
ర్విలసచ్చేలము. పద్మినీతిలక మీబింబోష్ఠి చెల్వారెడున్. 4

మ. ఇదినీలాకృతి విష్టపత్రితయమున్ గృష్ణంబు గావించునో!
ఇది గౌరంబొనరించునో భువనమండల్లన్ సుధావర్షమున్!
ఇది శోణమ్ము ఘటించునో జగమునశ్లేయంచు సంత్రాస స
మ్మదముల్ గ్రమ్ముఁ ద్వదీయమూర్తిఁ దిలకింపన్ మాకు సర్వేశ్వరీ! 5

శ్లో॥ స్తనద్వంద్వోత్సేధోద్దళిత నిజమార్గస్థ గగనా,
స్ఫురద్వీటీగంధచ్ఛురిత నిజపార్శ్వా, సునయనా
సహాసా ప్రత్యంగంమధురమధురాకారరుచిరా
చతుష్కాదేతీవామృతజలధితో త్రైందవకలా. 6

శ్లో॥ రతీంద్రాణీ వాణీ కరకలితవాలవ్యజనక
స్ఫురచ్ఛ్వేతచ్ఛత్రచ్ఛవి ధవళితాశేషభువనా,
సుపర్వస్త్రీన్యస్తాంఘ్ర్యుపచితి సుమప్రగ్యుతపదాం
గదంసంకుర్వంతీ ముహురపి సువేషావతరతి. 7

శ్లో॥ స్తువద్భక్తత్రాణత్వరితగమనాభ్యాసజనిత
ప్రయాసప్రస్విద్య న్నదతిలక సౌగంధ్యవదనా.
గళద్వేణీగుచ్ఛా, కుచచలితచేలాంచల చలత్
కరాంభోజా, కాచిన్నయనపదవీం మేనుసరతి, 8

శ్లో॥ వలన్నీలాపాంగా సరసగతి ఖేలన్మణిసర
గ్రహోద్విగ్న స్విన్నాంగుళికరతలా కాచిదబలా
స్మితధ్వస్తధ్వాంతాశ్రిత జనపరాధీన హృదయా
వసంత శ్రీరమ్యా క్షిపతి దృశిలేశానమృతజాః. 9

శ్లో॥ నటత్తాటంకాగ్ర స్థపుటిత వతంసోత్పలదళాం
చలాఘాతస్విన్నారుణ మసృణ గండ స్థలయుతా
అనంతైర్నేత్రాంతైర్లసతి జనితానంతమదనా
కలాభిః పూర్ణేందోః ప్రకటితసమా కాచిదసమా 10

శ్లో॥ నమన్మధ్యా తుంగ స్తనగిరి భరాదీషదధిక
ప్రరోహప్రశ్వాసా క్వణితవలయా కీర్ణకుసుమా
గళద్వేణీబంధా ఽధరపత దళిం చాలయితు మ
ప్యుదాసీనా కాచిత్ స్ఫురతి రతి ఖిన్నేవతరుణీ. 11

చ. స్తనయుగళోద్ధతిన్ నిజపదస్థనభమ్ము దితమ్ముగాఁగ, మో
హనముఖ వీటికాసురభిళానిలముల్ దెసలందుఁ బర్వఁగా
ననితరదృష్టపూర్వ మధురాకృతితో, నమృతాబ్ధినుండి చం
ద్రునికళవోలె నిర్వరవధూటి చతుష్కము దాఁటివచ్చెడున్. 6

మ॥ తమిఁ బార్శ్వమ్ముల భారతీరతి సతీంద్రాణుల్ దగంబట్టు ఛ
త్రము వీచోపులు నీనుకాంతిజగముల్ ధావళ్యమున్ బొందఁగా
నమరస్త్రైణసమర్పిత ప్రసవమాలాకీర్ణ పాదాంగదం
బమరన్ మాటికమర్చికొంచు నిదె యీయబ్జాక్షి యేతెంచెడున్. 7

మ॥ నొసటన్ గస్తురి బొట్టు చెమ్మగిలి యన్యూనంపు సౌగంధ్యముల్
దెసలన్ బర్వఁగ, వేణివీడఁ, గుచపాళీచంచలచ్చేలమున్
వెసనెక్కొల్పుచు, భక్తరక్షణవిధోద్వేలాశు యానమ్ముతో
నసమానాంగి యొకర్తు నేత్రవిషయంబై యొప్పె నియ్యజ్జనన్. 8

మ॥ చనుదోయిన్ బెనఁగొన్న రత్నసరముల్ చక్కంగ నెక్కొల్పఁగాం
దినవ్రేళుల్గలపాణి పల్లవముతో, నీలచ్ఛవీక్షాళితో,
జనతామోహతమోనిరాస దరహాస జ్యోత్స్నతో, నీ నరా
నన చూపట్టు వసంతలక్ష్మివలెఁ గందమ్మిన్ సుధం జిల్కుచున్. 9

మ॥ చెవి కెందామర లేకుతాఁకునకు గాసిన్ జెక్కుటల్ గంద, దృక్
నివహమ్ముల్ శతకోటి మన్మథుల వే నిర్జింప, రాకానిశా
ఛవిమచ్చంద్రకళాభిసూచిత వయస్సంవత్సర వ్రాతయై
జవరాలొర్తు మదీయ భాగ్యరమనా సాక్షాత్కృతిన్ బొందెడిన్. 10

మ॥ స్తనభారమ్మునఁ గౌనుతో త్రుపడ, నీషద్దీర్ఘనిశ్వాస మా
ననమున్ గ్రమ్మ, విలోలమై జడ ప్రసూనమ్ముల్ వికీర్ణమ్ముగాఁ
బొనరన్ వాతెఱడాయు తేఁటినయినన్ బోఁ ద్రోపఁగానొల్లక
స్వసజాతాక్షి రతాంతతాంతవలెఁ జూపట్టున్ స్వహస్తాంచియై 11

శ్లో॥ శనైర్భాషా శ్రేణీ మిషమధుర పీయూషపృషతా
వళిప్రోద్యత్పంకేరుహ పరిమళామోదిత దిశా
కనత్కూజత్కాంచీ కరగత విపంచీరవరసం
కిరంతీ కీరం ప్రత్యరుణ తను రేషావతరతి. 12

శ్లో॥ విపంచీమేకేనామృతకలశ మన్యేన వికచం
పరేణాబ్జం క్రీడాశుక మపరహస్తేన ముఖరం
దధానా దాక్షిణ్యాదృత కృపణభూదేవనికరా
మరాళీ సంచారా వితరతి పరాం నిర్వృతిమసౌ 13

శ్లో॥ సకోకా కాప్యేషా స్మరజనక శృంగార సరసీ
తరంగ వ్యాసంగాత్ క్షుభితపులినా హంసగమనా
చకాస్తిం దూచ్ఛేదచ్ఛవిహసిత నీలోత్పలవనీ
సకీరవ్యాహారా పరిమిళిత శైవాలవలయా 14

శ్లో॥ హసంతీయం రత్నాకర మథనకాలే సుమనసాం
పరిత్రాణార్థం శ్రీహరికృత జగన్మోహనతనుం
హరంతీ సంతాపం హ్యాదిపరిహరంతి మదగతీః
కరేణూనాం కాచి త్కుసుమిత లతేవాభిసరతి. 15

ఇతి, ఆవిర్భావకుసుమమ్.

---

చ॥ కరగత వల్లకీ రవసుఖంబు శుకంబునకింపుఁ బెంపఁగా,
సురుచిరకాంచికానినదశోభితయై, వచనాపదేశభా
స్వర మధురాధరామృతరసమ్మున దిక్కుల నబ్జగంధముల్
పఱపుచు నీవధూటి కనుపట్టు శుభారుణ గాత్రయష్టియై. 12

మ॥ వికచాబ్జం బొకచే, విపంచియొకచేఁ, బీయూషకుంభంబు వే
ఱొకచేఁ, జక్కమఱొక్కచేఁ దనరఁగా నుర్వీసుపర్వావనా
ధికదాక్షిణ్య రసమ్ముతో, సితపత్త్రింగేరు యానమ్ముతో
సకలంకాకృతి యీజగజ్జనని పూర్ణానందమున్ గొల్పెడిన్. 13

మ॥ సరసీజాక్షుని కేళికాసరసి యీచంద్రాస్య. కాకున్నచో
హరిణాంకద్యుతి ఫుల్లనీలకుముదం, బానీలశైవాలమున్,
వరటాయానము, వీచికాక్షుభిత దీవ్యత్ సైకతస్థానముల్,
సరధాంగంబు, సకీరవాఙ్నికర మీచందంబు కన్పట్టునే? 14

చ॥ వనధిమథించుచో, విబుధవత్సలతన్ హరిగొన్న విశ్వమో
హన కుహనాకృతిన్ దెగడు నందముతోఁ, గరిణీగణావహే
లనగమనమ్ముతో. మదికలంతఁ దొలంచుచు నీపురంధ్రి పూ
చిన నునుఁదీఁగె చందమునఁ జేరఁగ వచ్చెడి నద్భుతమ్ముఁగాన్. 15

ఇది, యావిర్భావకుసుమము.

# వర్ణనాకుసుమమ్



నకల్పంతేహంసాః పదగతి పరిజ్ఞానవిషయే
ముఖశ్రీలేశజ్ఞా నచ కమలజన్మ ప్రభృతయః
నవేత్తిత్వన్మధ్యం హరిరపి సుధాబ్ధి ప్రియసుతే!
మనస్త్వత్సఖ్యాత్తం మమనయతి వాచంస్తుతిపథం 1

శ్లో॥ త్వదీయం సౌందర్యం మదనజననీ నామవిదితం
ప్రసిద్ధం చౌదార్యం సురభిసురవల్లీ సహభువా
మహత్త్వం వాత్సల్యం భువనజననీ నామకధితే
తథాప్యం బ! శ్లాఘా సుతిసచన సాఫల్య సరణిః 2

శ్లో॥ సురాణాం స్వారాజ్యం కవిజనవచోరాజ్యమక్షయం
ప్రభూణాం సామ్రాజ్యం ప్రసవధనుషః ప్రాజ్యవిజయం
క్షణాద్వ్యస్యాస్తేఽసౌనళిననయన శ్లాఘ్యమహిమా
కటాక్షః కల్యాణం వితరతుజగన్మాత రమితం. 3

శ్లో॥ సరోజం సంఫుల్లం నవకువలయే గంధఫలికా
ప్రవాళౌకుందాళీ సురుచిరమధూకద్రుకళికే
అళిచ్ఛన్నాఽగుచ్ఛౌ పురుషకుసుమం పుష్పధనుషః
శ్శరీష శ్రీశ్చాహూస్తనవపురిదం పుష్పితవనం. 4

శ్లో॥ కచేచేత్ కౌటిల్యం కవితిలక నిర్ణ్యంకసాలసే
కుచేచేత్ కాఠిన్యం మధుమధన భాగ్యం ఘనతిహి
తయోర్వ్యంనా కంవాయదివహాసి భాసం వ్యాహ్యావయే
గతిః కావాస్మాకం తవచరణమూలం శ్రితవతాం 5

# వర్ణనాకుసుమము



పదగతి గోచరింపదు లవమ్మును హంసలకున్, ముఖైకసం
పదకమలోద్భవ ప్రభృతి భావము దాఁటెడు; దుర్లభంబు మ
ధ్యదశఁ గనుంగొనన్ హరికినైన; నినున్ నుతియింప నేర్తునే?
మది యయినన్ రసజ్ఞ నుతిమార్గముఁ జేర బలాత్కరించెడున్. 1

చ. విరివిలుకాని తల్లివను పేరనె చక్కఁదనంబు వ్యక్తమా,
సురభిసురాగమమ్ములకు సోదరివంటనె వ్యక్తమీఁగియున్,
గరుణయు సుప్రసిద్ధము జగత్త్రయ మాత్రభిధానయుక్తి; యీ
శ్వరి! యిటులౌట నీస్తవము భక్తవచస్స్ఫలత్వ వాంఛమై. 2

ఆ ప్రాజ్యజయమ్ము మన్మథశరమ్ములకున్, గవికోటికిన్ బవో
రాజ్యము, స్వర్గరాజ్యము సురప్రకరమ్మున, కద్వితీయసా
మ్రాజ్యము ఱేండ్లకున్, దృఢతరమ్ముగ నెయ్యదిగూర్చు నబ్జదృక్
పూజ్యమహత్త్వముల్ మనుచు ముజ్జగముల్ త్వదపాంగ పాతముల్. 3

ఉ॥ మొల్లలు నల్లకల్వలును బొన్నయు సంపెఁగయున్ శిరీషమున్
పల్లవముల్ మధూకముకుళమ్ములు తేఁటులతోడి వల్లరుల్
ఫుల్లసరోరుహమ్మును నపూర్వగుణాఢ్య ములివ్వహో! భవత్
సల్లలితాంగవల్లికను జాటుమనోజుని పువ్వుతోఁటగాన్. 4

తే॥ కురుల కౌటిల్యమేని విజ్ఞులకు మెప్పు
చనులఁ గాఠిన్యమేని కేశవునికింపు
గాక త్వత్స్వాంత మేతదాక్రాంతమైన
దేవి! మముబోంట్ల కిఁక వేఱు దిక్కుగలదె? 5

శ్లో॥ అరణ్యానీవాసాత్ క్వచిదపి నసంస్కార విరహాత్
తథానీచావాసా దుపమితిసహా శ్యామరవరాః
కవీనాందారిద్ర్యం కథనుపిహరే త్త్వత్కచభరః
తులాయానోహార్యం స్వసదృశ పదార్థాఘటనతః 6

శ్లో॥ తమోద్వంద్వం తప్త్వాకతితః తవనీమంత దళయోః
పదంచ క్రేహంసద్వయ చకితమాసాదితగుహం
ఇతి ప్రోచుః క్వేదం ప్రకృతి జడదమత్యంత మలినం
కచానాంక్వ శ్రేణిః జనని! సుమనో గమ్యసరణిః. 7

శ్లో॥ తమోరూపి ద్రవ్యంఘటవదితినైల్యా దనుమితౌ
నవాzలోకేదృశ్యం సతికిమితి తర్కాంసముదితం
సహార్షాసంహర్తుం ద్యుతిజితశరశ్చంద్రవదనే!
తమస్సామంధత్సేకచభరమిషేణాశుశిరసి. 8

శ్లో॥ ఇదంమన్యే హైమంకచభర తమిస్రేణ విజితం
శశోస్సాంధ్యస్యేం దోర్వపురితిశిరః కైతకదళం
కచామోదస్వాదిభ్రమరశిశులీలాం భజతితే
నిటాలేకస్తూరీతిలక కళికేయం సుఘటితా. 9

శ్లో॥ ప్రసన్న శ్రీసాత్రం విజితశతపత్రం సుకవిభిః
కృతస్తోత్రం మిత్రం శ్రితజనతమోగ్లాన్యపగమే
తవస్మేరం వక్త్రం హరిరచిత లీలామకరికా
వపుః పత్రం జైత్రం కుసుమధనురస్త్రం విజయతే. 10

శ్లో॥ హరేర్లీలాదర్శం కుమతిజనదుర్దర్శమనిశం
విమర్శస్థైః దృశ్యం విమలదరహాస్యం కమలగే
నిజభ్రూసంజ్ఞాభి ర్నియమిత సమస్తత్రిభువనం
శ్రుతీనామాస్థానం తవముఖమఘం నః క్షపయతు. 11

చ॥ అడవుల గ్రుస్సి, సంస్కరణ మన్నదిలే, కతిసీచసంగతిన్
బోడవలు చామరమ్ము లెటుపోలు భవత్కబరీభరమ్ముతోఁ
బడఁతిరో! త్వత్కచాభమగు వస్తువులేమిఁ గవుల్ దరిద్రులై
య్యెడ నుపమార్థులై, ధనసమృద్ధి భవత్కృప నాఢ్యులయ్యెనున్. 6

మ. తిమిరద్వంద్వము హంసయుగ్మకృతభీతిన్ దా గుహాంజేరి సం
యమనిష్ఠంగని నీదుసేస కిరుచాయన్ నిల్చెఁ గేశాపదే
శముచే నం డ్రదివట్టికల్ల. సుమనస్సంప్రాప్యపా నీదు శీ
ర్షము చెట్లొందు నసన్నలీమసతమో వ్రాతిమ్ము సర్వేశ్వరీ! 7

ఉ. ఎందును నీలతానుమితిమిద్ది ఘటంబటులొక్క ద్రవ్యమం
చుం దుదిఁదేజమున్ బొరయుచోఁ బొడకట్టదుగానఁ గాదటం
చుం; దులకించువాదములఁజొప్పఁగ నెంచిగదా? వహించె దా
న్యేందుని మీఁదఁ జీఁకటుల నెయ్యెడలన్ గబరీమిషంబునన్. 8

మ॥ కన, నీశీర్షమునందుఁ బెందుఱుము జీఁకట్లోర్చి బంధింప ని
ల్చిన సాంధ్యైందవపోతమట్లు కనకశ్రీకేతకీపత్రమాఁ
చనరున్ గస్తురిమొగ్గబొట్టలిక గంధస్వాది రోలంబ డిం
భ నిరూఢిన్ భవదీయఫాలమున, సర్వశ్లాఘ్యమై భార్గవీ! 9

చ॥ జితశతపత్రమై, సుకవి సేవితమై, స్మితకందళీ సమ
న్వితమయి, భక్తజాడ్యహృతి పేశలమై,, జలజాతనేత్ర చి
త్రితమకరీకలాపమయి శ్రీకరమై యతి సుప్రసన్నమై
యతనుని మోహనాస్త్రమన నంబ! త్వదాస్య ముపాస్యమయ్యెడున్. 10

చ॥ హరికి విలాసదర్పణ, మనార్యులకున్ గనరాని సీమ, ధీ
వరులకు దృశ్యమెయ్యెడలఁ, బ్రాణుడికోటికి నాటపట్టు, వి
స్ఫురితదరస్మితామయము, భ్రూచలనైక కృతత్రిలోకసం
భరణము త్వన్ముఖాంబుజము మాదురితమ్ము లణంచుఁగావుత న 11

శ్లో॥ స్ఫురన్ముక్తాసారం శ్రితకుసుమహారం శిరసి స
ద్వచశ్శ్రీమాధుర్యామృత రసవిధానం స్మితధనం
బుధానందాధానం తవవదన మంబ! ద్యుతిఘనం
హరేర్భావాలానం స్మరరతివిమానం విజయతే. 12

శ్లో॥ యదాకించిత్కించి ద్వదనరుచిలేశాన్ హరతి తే
సరోజానాం బృందం మిహిరకరమార్గా త్తదను తాన్
తదాతాటంకాత్మా ఽ ర్పయతి ఖలురాజా ప్రతిహరన్
స్థితానాం సన్మార్గే చరితమితిరాజ్ఞాం ప్రకటయన్. 13

శ్లో॥ ప్రసిద్ధం ఖల్వబ్జద్వయమిద ముదన్వత్ప్రియసుతే!
తమోగ్రస్తప్రస్తాంశుకమితి కనిష్ఠం భువి దివి
సురజ్యేష్ఠశ్రేష్ఠ ప్రభృతిభి రుపాస్యం హ్యతతమః
త్వదాస్యం త్వాశాస్యం కథముపమితి శ్రీవిధమిదం, 14

శ్లో॥ సుధాధామాత్మానం తవసురభివక్త్రేణ శుచినా
సమీకర్తుం స్వస్మిన్ మృగమదవిలేపం విరచయన్
కళంకీసంజాతః; ఖలుబత జడాత్మా కృతిమతాం
సుదృగ్భిస్సాధర్మ్య కలన మపచారాయ మహతే. 15

శ్లో॥ స్మరస్యైతన్నార్యా అపి విమల లీలాముకురయోః
ద్వయీమూచుః కేచి త్స్మరరథరథాంగద్వయమితి
తయోర్వ్యక్తి క్రీడామకరశిశుయుగ్మం లిపిమయం
రహస్సౌధద్వంద్వం సుతను! తవ గండస్థల యుగం. 16

శ్లో॥ శుకీనాం వైఖర్యశ్శ్రుతి మధురిమాభ్యాసరసికాః
శ్రయంతో నైర్థ్ర్యా చ్ఛిశువయసి లీనా వచసి తే
తతో ముక్తాఖ్యాతిః ద్విజకరక బీజావళిరభూత్
ప్రవాళశ్రీ చ్ఛన్నం స్ఫురదధరబింబం తదుపయో. 17

మ॥ కృతహర్షమ్ము బుధాళికిన్, మృదువచశ్శ్రీమాధురీధుర్య, మ
ప్రతిమానద్యుతిరోచిరుద్గమము: శీర్షభ్రాజి పుష్పస్రగ
న్విత మబ్జాక్షి హృదేక మోహనము, దేవీ! త్వన్ముఖాంభోజ మా
రతికందర్పులదౌ విమానమనఁగా రాజిల్లు నత్యంతమున్. 12

చ॥ ఇనకిరణైక మార్గమున నెయ్యెడఁ బద్మలు నీ ముఖంపు ని
గ్గు నపహరించుఁ గొంత, మణికుండల రూపకుఁడయ్యెడన్ బదం
బున ద్విజరాజుదానిఁ గొని మున్నెటులట్టిడు, సత్పథైక వ
ర్తి నృపచరిత్రమిట్లని ధరిత్రికి బోధనసేయునో యనన్. 13

తే॥ పానరుఁగా కబ్జయుగళమ్ము భువిని దివిని
నది తమోగ్రస్తము కనిష్ఠ మంబుజాక్షి!
దానితో నెట్టు లుపమింపవచ్చు మాకు
హ్యాతతమమ్ము త్వదాస్య మామ్రేడితమ్ము. 14

చ॥ సురభిళమై శుచిత్వమున శోభిలు నీవదనమ్ముతో సుధా
కరుఁడు సదృక్త్వమున్ బొరయుకాంక్ష మృగీమద చర్చితాంగుఁడై
యరయఁగళంకియయ్యెను; జడాత్మకులయ్యు సుపృక్సదృక్త్వ సా
దరమతులైనవారి చరితమ్ములకున్ ఫలమిట్టిదేకదా. 15

మ॥ రతికందర్పుల కేళిదర్పణములో. ప్రత్యగ్రతత్స్యందనా
ద్భుతచక్రమ్ములొ, యంచుఁ గొందఱు దలంతుర్నీకపోలమ్ములన్
బ్రతిబోధించెదునైన వారలర హాః ప్రాసాదయుగ్మమ్ముగా
సతి! క్రీడామకరీ శితద్వయము విస్పష్టమ్ముగా నచ్చోటన్. 16

మ॥ పలుకుందియ్యఁ బదంబు నేర్చుకొనఁగా వాంఛన్ శుకీవైఖరుల్
లలినీవాక్పు [illegible] మయ్యె నఁట బాల్యంబందు, దానన్ భయం
బొం[illegible]యన్ దాడిమ [illegible] జపశ్శ్రీ [illegible] ని [illegible] యుష్మద్రదశ్రేణి ము
క్తలు [illegible] ప్రాసెఁ; బ్రవాళకాంతి నహరన్ గద్మోష్ఠబింబం [illegible]. 17

శ్లో॥ విభాతి త్వద్వీటీ ముఖకమలపేటీ పరిమళా
ప్రసర్పత్కర్పూర క్రముక మధుగంధాంచితమదా
లవంగైలామోదా జడిమదళనోద్యోగ నిపుణా
సముక్తాచూర్ణేషా సురవినుత సౌరభ్యమహిమా. 18

శ్లో॥ హరి ర్యా మాస్వాద్య ప్రజయునతి మాన్యాధరసుధో
ల్లసద్వంశీగాన శ్చరతి భువి వీటీ జయతుసా
కవోష్ణాకస్తూర్యా స్మితలవసుధా లేశశిశిరాz
ధరశ్రీసంపర్కాత్ భృశమధురశోణా తవముఖే. 19

శ్లో॥ అహోమాతర్మాత ర్మమవితర వీటీరసలవం
వదంత్యేవం బ్రహ్మ స్మరహరిముఖా స్త్వత్పరిసరే
యమాస్వాద్య స్వాస్థ్యే ష్యతి మధురసారస్వతరసా
కవేర్వాణీ వక్తుం ప్రభవతికథం తన్మధురతాం. 20

శ్లో॥ విధాతా కహ్లార ద్రవమిళితహారిద్రరజసా
వపుఃకృత్వా కృత్స్నం వ్యధిత తవదంతచ్ఛదతలే
సుధాలేశం నోచే దరుణిమసమృద్ధిః కథమహో
భ్రమంత్యస్మిన్ కేచిత్ స్మితమితి హిమాంశుచ్ఛవిరివ 21

శ్లో॥ కవీంద్రై రాశాస్యాం తవ జనని! నాసాంరతిపతేః
ధనుర్దండం చండం మృదుకుసుమ కాండై ర్విజయదం
వద త్యగ్రాలంబిస్ఫుటరుచిరముక్తా ఖలుతథా
ప్యరత్నప్రేక్షాణాం తిలకుసుమబుద్ధిః ప్రభవతి. 22

శ్లో॥ మణి ర్నాసావంశ్య శ్చిరవిరహపాండు స్త్వదధరం
ముహుర్యాతాయాతై రనుసరతి గంతుం రదమణేః
యునక్త్యాభి ర్దీనాదరదదరహాస స్సపది తం
విశుద్ధ శ్శుద్ధానాం నచిరయతి ఖేదం శమయితుం. 23

ఉ॥ ముత్తెపుసున్నమున్ గ్రముకముల్ మృదునాగలతా పలాశముల్
మెత్తని కప్పురంపుఁబొడి మేలు లవంగము లేలలున్ సుసం
పత్తిఁ జెలంగఁ, ద్వద్వదనపద్మసుగంధసమేతమై, శుభా
యత్తత నొప్పు నీదువిడియమ్ము జగజ్జడిమంబుఁ జోపుతన్. 18

చ॥ నెరవునఁ జక్రి యేదిగొని త్రేతలకున్ మురువైన వేణునా
నరుచిఁ జెలంగెనో, స్మితసుధారుచిర స్మధర ప్రసక్తిచే
నరుణము మాధురీగుణసహమ్మును గస్తురిచేఁ గవోష్ణమై
పరఁగెడు నీవిడెమ్ము రసవత్కృతి నైపుణి మాకుఁ గూర్చుతన్. 19

ఉ॥ ఆనిపరీతి స్వప్నమదియైనను జాలుఁ గవీంద్రవాణి యె
ద్దాన సుధాసమానమగు; దర్పక ధాత్ర పురందరాదు లె
ద్దానికినై పెనంగెదరు తల్లిరో! యిప్పుది నాకునాకటం
చానన పీటికారస మనంతఫలమ్ము త్వదీయ మోముతెన్. 20

చ॥ నలినభవుండు రక్తనళినంపు రసమ్ము నిశారజమ్ముతోఁ
గలిపియొనర్చి నీతనువు కమ్మని మోవితుదిన్ సుధాలవం
బెలమి ఘటించెఁ; గానియెడ నెట్లట శోణిమపర్వెడున్ గవీ
శులది హిమాంశుకాంతి యనుచున్ స్మితమంచు భ్రమింత్రు భార్గవీ! 21

తే॥ కొనఁదొలంకాడు ముత్తెమ్ము జనని! నీదు
నాసికను దెల్పు స్మరుని బాణాసనముగ
నైన నది యరత్నప్రేక్షు లైనవారి
కొనరఁ దిలపుష్పమన్న యూహానుఘటించు. 22

ఉ॥ ప్రమసిరో! విప్రయోగధరపాండువు తావకనాసికాగ్రవం
శ్యమణి, గమాగమమ్ములను సారెకు దంతమణీప్రయుక్తిఁ జే
యుమని త్వదోష్ఠమున్ దరియుచుండఁ ద్రుటిన్ దరహాస మాయభీ
ష్టమొనరిచెన్ విశుద్ధులు వెసన్ విమలాత్ములకోర్కెఁ దీర్పరే? 23

శ్లో॥ నటన్నాసాపార్శ్వే మణిమయ శలాకాగ్రఘటితం
స్ఫుటం సవ్యే ముక్తాఫల మివ మనర్ఘ్యం తవ రమే
హారిం మత్స్యాకారం ఘటయితుమటన్ మారశబరః
కటాగ్రం కింధత్తే మతి మితి విధత్తే మమ పునః. 24

శ్లో॥ శుక స్స్వర్ణాకార స్తవనసిలసన్ కంధరకల
స్వనాభ్యాసీ కంఠాభరణగత వైడూర్యమణిషు
విశాలాక్షి భ్రాంత్యా చకితచకిత స్సన్నతశిరాః
ప్రవేష్టుం నాసాకీచకబిలముఖం పశ్యతి కిము. 25

శ్లో॥ అసౌకీరః కశ్చి న్ననివసతి రుక్మాకృతిధరః
కిమత్తుం నావాయామణి మధరబింబంచ కలయన్
ఇదం బీజం భక్ష్యం కిముతధరిభక్ష్యం ఫలమితి
ప్రశంసన్ సందేహాకులితహృదయ స్తద్రుచిగుణాన్. 26

శ్లో॥ శ్రుతింయాతా మాతః కువలయవళం హర్తుమచిరాత్
భవదృష్టిః పశ్చాత్ శ్రుతిఘటితవర్ణక్షుతిరితి
విధత్తే సౌహార్దం సదయ చకితా తేన భువనే
ప్రసూయ స్త్రీత్రంస్యాత్ శ్రుతిశిఖరమార్గం శ్రితవతాం. 27

శ్లో॥ రవే రంశుస్పర్శా న్నలినమపి చేందీవరయుగం
పరిమ్లానిం యాయా దితి సకృపయా చాత్మనిపదం
త్వయానీతం నోచే త్తిమిసహచరత్వం కిముగ్నో
స్వభావ స్స్వభ్యాస్తోఽనుపతతి జన్మాంతరమపి. 28

శ్లో॥ సదా శ్రీసాన్నిధ్యం సమభిలష దిందీవరవరం
తపస్య ద్గంగాయా స్తటభువి జలాధారమచిరాత్
కరాభ్యా ముద్ధృత్య శ్రవసివహాసి స్వేక్షణసమం
నను శ్రీసంస్థానే యదిహి సదయా కిం వదిశసి. 29

తే. మణిశలాకాగ్ర ఘటితమై మహిళ! నీదు
నాసకొననొప్పు ముత్తెమ్ము నళినబాణ
శబరుఁ డలమత్స్యమూర్తిఁ గేశవునిఁబట్టి
నుంచినకణాగ్రమట్లుగా నూహ్యమయ్యె. 24

చ॥ గళమధురస్వనాభ్యసన కౌతుకివై యటఁగంఠహారసం
కలితవిహారజ ద్యుతులఁగాంచి బిడాలదృగీహఁ జేసి బె
గ్గిలి తలవంచి వంశసుషిఁ గేరెడు నీనునునాస దూరఁ జా
పులునిగిడించుకీరమనఁ బుత్తడి చిల్కత్వదీయ మొప్పెడున్. 25

చ॥ ఇదిఫల మిద్దిబీజ మిటనెయ్యది నేఁజవిగొంటకర్హ మొ
ప్పిదముగనంచు నీయధరబింబము ముంగరముత్తెమున్ బదిం
బదిఁగనుఁగొంచు సంశయనిమగ్నత నున్నశుకంబుపోలెఁ జా
డ్కిఁదనువు జాతరూపమయ కీరము నీదగునాసచెంగటన్. 26

చ. శతదళమున్ హరింప శ్రుతిచక్కటికిన్ జని యట్లొనర్చునో
శ్రుతిగతవర్ణవిప్లవము చొప్పడునంచుఁ దదంబుజంబుతో
హితత వహించె నీదు కనుదృష్టి దయాచకిత స్వభావమై
శ్రుతిశిఖరాధ్వగాముల కనూయువులున్ జెలుతొందుచే కదా! 27

చ॥ వెలుఁగుల తేనికాఁక దురపిల్లెడు కల్వలజంటనొండు న
ర్తిలిఁ గనుదోయిగాఁగ నొనరించితివౌర! కృపార్ద్రదృష్టిచేన్.
నెలఁతరో! యత్తొగల్ విడువనేరవు నేటికిఁ దొంటిపుట్టువం
దలవడి వెంటవచ్చిన మహాగుణమున్ దిమిసాహచర్యమున్. 28

శా॥ శ్రీసాన్నిధ్యసదాప్తికై సురనదీసీమన్ జలాగారమై
దోసంబేదఁ దపంబుసల్పుతొగఁ దోడ్తోడన్ శ్రవోభూషగా
వాసిందాల్చితివౌర! నీకరుణకున్ బాత్రంబులౌవారికిన్
శ్రీసంస్థానసుఖంబు చెల్వలరుటల్ చిత్రంబె? సర్వేశ్వరీ. 29

శ్లో॥ కుముద్వత్యాః పుష్పం కువలయసమాక్రాంతి కుతుకం
భవత్యా స్సంపశ్య న్నయనతిమిరాజం శ్రుతిలసత్
ముఖే దూర్వాంకూరం వహతి రిపుభావో బలవతా
పదాలంబే సత్యే హ్యహహా! పరితాపం జనయతి. 30

శ్లో॥ సకృత్తే ద్దృక్పాతో జనని! యదికస్మిన్నపి భవేత్
తదానీమేవాస్మిన్ కువలయ సమాక్రాంతి కుశలే
సతీత్వం సందేహః కిమితి కలశాంభోధితనయే!
కవీనాం త్వన్నేత్రం కువలయముతాక్రామతి నవా 31

శ్లో॥ యదారాధ్య శ్రీమాన్ హరిపదమనన్యాశ్రితతయా
ముఖచ్ఛాయామిచ్ఛన్ ఉడుపతి రయాసీత్తరళతాం
తదా ముక్తాకారా భవదురసి తారాస్తరళాః
పతీనాంసాన్నిధ్యం నజహాతిహి సాధ్వ్యః క్షణమపి. 32

శ్లో॥ రతేర్భర్తుః క్రీడాకుసుమ వనవాటీ తనతమా
కిరంసూ తస్మధ్యే కృతపటకుటీరా నివసతిః
ఉపాంతే ముక్తాభిర్విరచిత గుళుచ్ఛం కుచనిభం
ఘుటీయుగ్మం హైమం శిఖరఘుటితం తాకథయతి. 33

శ్లో॥ సమత్వం వాంఛంతీ మిభకలభరాట్కుంభయుగళీం
స్తనద్వంద్వేనాంభః పతిలలితకన్యే! మదవతీం
స్పృణీసూత్యాతాం దృష్ట్వాసుతను! తవనేత్రాకృతిధరా
చకోరీ త్వద్వక్త్రే తు ర్విరచయతి పాదానుసరణం. 34

శ్లో॥ నవీనాభ్యాంకృత్వా నళినముకుళాభ్యాం తవకుచౌ
వికాసాశంకాత శ్శశికల మాదాయమదనః
స్మితంచక్రే చక్రస్తని! తదుపరిష్టా త్తనద్విశో
ర్యుగం.సాక్ష్యేతస్మిన్ కువలయకృతం శ్రీనిబిడితం. 35

ఉ॥ శ్రవణోత్తంస కుముద్వతీసుమము యుష్మన్నేత్రవైసారిణ
ప్రవరుఙ్ జారుతరద్యుతిఙ్ గువలయాక్రాంతిం బ్రవర్తిల్లువా
నివిలోకించి వహించెనోటఁ గసవుఙ్. బృద్ధిఙ్ మహాద్వైరమెం
తవిశేషాశ్రయమున్నవారికిని సంతాపంబుఁ జేయుంజుమీ. 30

తే॥ నీదుకడకంటిచూపు చెందినయతండె
కువలయాక్రాంతి కుశలుఁడై భువిఁజరింపఁ
గన్నుఁగవనీది కువలయాక్రాంతి కుశల
మవునో? కాదో? యనెడు శంకయగ్గ్హా మగునె?. 31

మ॥ అలినియాస్యపుఁజాయకై హరిపదాలంబంబు గావించి చు
క్కల తోఁడెప్డు కృతార్థుఁడై తరళతఙ్ గన్పట్టునో నీయురః
స్థలి. ముక్తాకృతులౌచుఁ జుక్కలపుడే తత్సన్నిధిఙ్ జేరు; నా
గుల వీడ్పాటున కోర్వలేరుగద సాధ్వుల్ జన్మజన్మములన్. 32

మ॥ రతికందర్పుల కేళిపుష్పవని నీరమ్యాంగక; మ్మందు ము
ద్రితివారల్ విహరింపఁగాఁ బటకుటీరమ్ముల్ వినిర్మించినా
రతిచిత్రమ్ముగఁ: గాకయున్నఁ బయినేలా నిల్ప వక్షోరుహ
ద్వితయవ్యాజసువర్ణకుంభములు ముత్తెంపున్ సరుల్ వ్రాలఁగాన్. 33

తే॥ సమదకరికుంభముల్ ఘనత్ స్తనసమత్వ
మాసచేసి స్పృణిస్యూత మగుటఁ గాంచి
తావకవిలోచనాకృతిధర చకోరి
యనుసరించుఁ ద్వదభ్ర తృపాదాంతికమ్ము. 34

చ॥ లలితములైన పద్మముకుళమ్ములఁ ద్వత్కుచముల్ ఘటించి పూ
విలుతుఁడుచేసె నీస్మితము వెన్నెటఁ దద్దసనైకశంకచే
నలికులవేణి! దానికిని సాక్ష్యముచెప్పు మనోహరమ్ము లు
త్పలకృతముల్ ప్రభానిబిడితమ్ములు నీనిడుసోఁగ నేత్రముల్. 35

శ్లో॥ మృణాళే త్వద్బాహూ కరయుగమిదం కోకనదయో
ర్యుగం నోచేదేవం కిమితి నివసే త్కీరవిహగః
సుధాపూర్ణస్థాళీం వహసి వద తస్మై శుక వయే
సుధామస్మైదాతుం కవిజనని! యద్వాఽశుకవయే? 36

శ్లో॥ త్వదుక్తే స్త్వన్మాస్యా స్తదను తవవేణ్యా వదనతో
హరిర్యాతో భీత స్తరుగిరిధరావ్యోమబిలగః
తథాప్యేకో మధ్యః సుతను! సుకవీనాం హరిపద
స్మృతింధత్తే యత్త త్ప్రతిపదమిదం విస్మయపదం. 37

శ్లో॥ బుధా స్త్వద్రోమాళిం కుసుమశరరాజధ్వజయితి
ప్రశంసం త్యేవంచే త్కిమితి నివసే దంకశఫరీ
అసిశ్యామాం మన్యే శ్రితసళిపదత్వా దహామిమాం
శశి భ్రాంత్యా రాహుం తరళమణిమత్తుం ప్రచలితం. 38

శ్లో॥ అసారత్వా దంతస్సురకరి కరస్సక్థియుగళీ
తులాయామారోఢుం సురసరితి పీతామృతరుచిః
స్తరం స్త్వత్కాంతిన్యం విధికృతమహో! పాండురవపు
ర్జహౌతం స్రూత్కారైస్సహ నిజమదేనాశునశసి. 39

శ్లో॥ చిరంనీరాహారౌ హరియువతి! హంసౌ తవపదం
శ్రయంతౌ స్వర్ధున్యాం కలితశుచిభావౌ ప్రతిదినం
గతౌ వర్ణోత్కర్షం పదయుగజుషా హంసకమిషాత్
గతిం కాంనోనూతే స్వపదపరిచర్యా భువిసతాం. 40

శ్లో॥ నమద్దివ్యశ్రేణీదృ క్కుటిలకబరీ ప్రస్త కుసుమ
ప్రవచ్ఛ్ఛధుస్వాది భ్రమరతతి కోలాహలనహః
ధునోత్వక్షేమం న స్తవచరణ మంజీరకమణి
స్వనానాం సందోహః పరికలిత మాంగల్యనివహః. 41

ఇతి, వర్ణనాకుసుమమ్.

తే॥ బాహులు బిసమ్ము, లెఱ్ఱకల్వలు కరములు
నీకుఁ గాకున్న నిటుఁ జిల్కనిల్వ నేల?
తాల్తుఁ గేలసుధాస్థాళి, తదమృతమ్ము
నా శుకవికిత్తొ? యిత్తొ యి య్యాశుకవికి. 36

చ॥ కరము త్వదుక్తికిన్ జడకుఁ గొనుకు మోమునకున్ విభీతుఁడై
తిరు ధరణీ ధరాభ్రబిల తత్పరతన్ హరిడాఁగ నేగెనా
నిరవగు విస్మయమ్ము వెలయింపదె? నీదగు కౌనుమాత్ర సుం
దరి! కవికోటికిన్ హరిపదస్మృతి నిప్పటికిన్ ఘటించునాన్. 37

చ॥ స్మరవిజయధ్వజమ్ముగఁ బ్రశంస యొనర్తురు నీదు రోమరా
జి, రసికు, లద్దియట్లయినఁ జహ్నము మత్స్యము లేకయుండునే?
తరుణి! వినీలమై చలిపదమ్మువనున్కని దాని మన్మతిన్
పరిశిమణిన్ సుధాంశువని దగ్గఱు రాహువుగాఁ దలంచెదన్. 38

చ॥ అమృతపు టోగిరంపుఁ గరిహస్తము నీతొడపోల్కకై ప్రయ
త్నము పడి జాహ్నవీసలిలధారల లోపసఁ గొన్నదై నిస
ర్గము నియతమ్మునైన జరత్వ మవార్యము కాస్తరించి దై
న్యము మెయివెల్లనై విడిచె నచ్చలమున్--జలమున్ నభస్స్థలిన్. 39

శా॥ నిర్ణిక్తస్థితి స్వర్ణదిన్ దపవుగా నీశ్వేతతోఁ బ్వత్పదో
దీర్ణప్రేమను హంసముల్ దపమునార్తిన్ సల్పిక్రౌంచబుట్టుకన్
వర్ణోత్కర్షముగాంచి హంసకములై భాసిల్లె నీయంఘ్రులన్
వర్ణింపంగ భవత్పదాశ్రితుల కబ్రంబొక్కొ తాదృక్స్థితుల్. 40

చ॥ వినతి వియచ్చరీ చికురవేశ గళత్కుసుమావళీ ప్రస
క్తినుమాకరింప బిందు సముదాయ విలోల మదద్విరేఫ ని
స్వన ముఖరీకృతమ్ములు శుభప్రదముల్ నిరసించుఁగాత క్ర
న్నన భవదంఘ్రిహంసక ఝణంఝణనిక్వణముల్ విపద్దశల్. 41

ఇది వర్ణనాకుసుమము.

# పూ జా కు సు మ మ్

మనో మేశామందా, తవచరణ భక్తిర్ఘనరసః
తతస్సిక్త్వా శ్లేఖావళి ఘుసృణరేణూంశ్చ నవతీం
సుమత్యాలేఖిన్యా హృదయకమలే విస్తృతదళే
లిఖిత్వా ధ్యాయేయం తనులలితలేఖాకృతిమతీం. 1

శ్లో॥ పదేలగ్నంపాద్యం కరకిసలయేర్ఘ్యం మమమనో
ముఖే తే పానీయం శిరసి తవ పంచామృతమయం
కనౌశాటీ పాటీరమపి కుచయుగ్మే త్వదురసి
స్ఫురన్ముక్తాసారం పరిచరతి భూషాపరికరైః. 2

శ్లో॥ మహారాజ్ఞి! ప్రత్నమణి నికర నిర్యత్ ఘృణిగణ
ప్రసారప్రధ్వస్తాఖిలభువనసంస్థాంధతమసం
స్వయంభుప్రత్యుప్తం ప్రణత జన సంప్రార్థితఫల
ప్రదే! గృహ్ణీష్వైత చ్ఛిరసిఘటితం రత్నమకుటం. 3

శ్లో॥ సకస్తూరీ లాక్షా జ్వలనశిఖ సిందూరరజనీ
సితాభ్ర శ్రీగంధాంజనకరకికా దర్పరచనీ
సతాంబూలీపాత్రీ సిచయ మణి కూర్పాసవసనైః
సహాయం శ్రీస్వచ్ఛయా న్మణితిలకపేటీ తనుమదే. 4

శ్లో॥ ముఖంమాఘ్యైశ్శ్యామైఘ్యై ర్నయనయుగమిందీవరదళైః
అతస్యాభ్రూభాగం నిటలమపి సంఫుల్లకమలైః
సువర్ణైః త్వన్నాసాం దశనవసనం కింశుకసుమైః
కపోలౌ మాధూకైః శ్రుతిదిశమపి శ్రీతరుదళైః. 5

# పూజాకుసుమము

ఘనమనుపాత్రఁ జిప్పిలు సమంచిత భక్తిమరందమందుఁ గ
ల్పనలను రక్తరేణుపటలమ్మును ముంచి, మనీషయన్ సుఖే
లనపుఁ గలమ్ముతో, స్ఫుటదళమ్మగు మత్హృదయాబ్జమందు నీ
తనులలితస్వరూపము వివర్ధత వ్రాసి భజింతు భార్గవీ 1

మ॥ పదయుగ్మమ్మునఁ బాద్యమై, శిరమునన్ బంచామృతాకారమై
హృదిముక్తావళియై, కటిన్ వసనమై, శ్రీగంధమై చర్చనన్
వదనాంభోజమునన్ గరద్వయమునన్ బానీయమై యర్ఘ్యమై
యిదె మచ్చిత్తమభీష్టముల్ సలుపునీ కన్నెని చందమ్ములన్ 2

తే॥ మణినికరనిర్య దమలాంశు గణనిరస్త
భువన సంస్థాంధతమస మ్మపూర్వతరము
బ్రహ్మనిర్మిత మీదివ్య రత్నమకుట
మంబ! నీకు శిరశ్శ్లాఘ్య మగునుగాత. 3

మ॥ ఘనసారాంజన గంధసార రజనీ కస్తూరికా రక్తచం
దనమందార సమేతమున్, గరకికాదక్ష్యైక తాంబూలభా
జనసంపన్నము. రత్నకంచుక సువస్త్రశ్రేణితో నిచ్చెదన్
జననీ! యీతిలకంపుఁ బేటి భవదిష్టస్ఫూర్తికైఁ గావుతన్. 4

సీ॥ పసిపమ్ము మొల్లలఁ, జేపవి కింశుకముల, నిటలమ్ముసంఫుల్ల నీరజములఁ
జెవులు శ్రీదళముల, శిరము చీఁకటిపూలఁ, బాణులు పన్నీటిప్రసవములను
జనులుపూఁగుత్తుల, సంపెంగలను నాస, గండమ్ములు మధూకకళికములను
బొక్కిలి పున్నాగములఁ, గనుల్ కల్వల, నూరులు సప్తచ్ఛదోద్భవముల 5

శ్లో॥ శిరస్తేతాపింఛైస్సుతను! సుమగుచ్ఛైః కుచయుగం
నమేయూర్త్రైర్నాభిం స్థలనళిన బృందైః తవకరౌ
పదేరక్తాశోకైర్విషమదళశైర్మారుయుగళం
శిరీషైస్సర్వాంగం చిరమపచినోమ్యంబ! సద్భిస్సైః. 6

శ్లో॥ దుఃఖౌఘద్రుమబీజఖమలినతాం ధూపం గృహాణాంబికే!
తేజస్స్వీకురుతైజసం మమమనో నైవేద్యమాంగీకురు
ఆనందాబ్ధిభవస్య చిన్మయతనో రిందోః కలామోహినీం
త్రైగుణ్యాం వదనాంబుజే తవశివే! తాంబూలమాంగీకురు. 7

శ్లో॥ ఇహాదర్శ ప్రీత్యాతే ముఖమభిముఖీకర్తు ముచితం
విధుచ్ఛత్రాకారశ్శ్రయతిచ ఖచద్వ్యక్తచకితః
కృతం చిత్తేనాపి శ్రితపరిసరం చామరయుగం
విహస్తం ధమ్మిల్లా ధృతమపి కరేవల్గతి ముహుః. 8

శ్లో॥ నిమేషాదుస్మీల ద్రుచిరబహువేషాం, విదుషి! తా
స్మనిషాశైలూషీం లసదభినయాం లాస్యకుశలాం
రసాలంకారాఢ్యైస్సహృదయ సమాహ్లాదనపరాం
పదాగ్రే నృత్యంతీం స్నపయ తవవీక్షామృతరసైః. 9

శ్లో॥ అముంచేటీవర్గం సుతను! సుమనస్సర్గవిభవం
గృహాణ త్రైలోక్యభ్రమణనిపుణాం ధీంద్రియగణం
సుఖీసేవాసాధుం జడమపిచ కర్మేంద్రియగణం
త్వదాజ్ఞాకారిత్వే కృతికుశల మంగీకురు శివే. 10

శ్లో॥ అసౌమాక్షీ ద్రాక్షాజనిత మిగమిక్షు ... స్సమితం
సుధాఖార్జూరీయం మధురమధుపీంతాలజ మిదం
మనోనోచే దత్రాస్మ్యతభరిత ఘ్రాంగాయుక ...
పురామోహిన్యాః కరకమలగాంస్తే కలయతాం. 11

తే॥ పాదయుగ్మముఁ బాటల మంజుళములఁ
దివిరి సకలాంగకమ్ములు దిరిశనములఁ
బరమ సాదృశ్యధర్మపావనములగుట
సావధానమ్ముగా సమర్చన మొనర్తు 6

మ॥ ఘనదుఃఖద్రుమ బీజ ధీమలినతన్ గైకొమ్ము ధూపమ్ముగాన్;
గనుదీపమ్ముగ మున్మనఃకళిక: నానందాబ్ధి సంజాతచి
త్తనుశీతాంశు కళల్ నివేదనముగాఁ దర్కింపు; త్రైగుణ్యమున్
గొనుతాంబూలముగాఁగఁ ద్వన్ముఖమునన్ గూర్తున్: త్రిలోకేశ్వరీ. 7

చ॥ కరుణను ద్వన్ముఖం బభిముఖంబొనరింపుము నానబూనునీ
పరముకురమ్మునన్; గుముదబాంధవుఁడున్ భవదాస్యభీతుఁడై
పరిసరమందు ఛత్రమున వ్రాలె; నిఁకన్ గబరీభయమ్మునన్
గరధృతమయ్యెఁ జామరయుగమ్ము మనః కృతపల్లలాడెడున్. 8

చ॥ ప్రతినిమిషోన్మిషత్ బహుళభాసురవేషయు, లాస్యవైఖరీ
చతురయు, మంగళాభినయశాలినియున్, రసభూషణాదినం
దితబుధయున్, భవత్పురసదేశమునన్ నటియించుదాని మ
స్మృతియనునాటకత్తెఁ గరుణన్ దిలకింపఁ గదమ్మ భార్గవీ. 9

మ॥ సుమనస్సర్గవిభూతియున్ ద్రిభువనాస్తోక ప్రచారప్రభా
వము శోభిల్లెడు నాదుధీంద్రియములన్ భావింపుచేటీవితా
నముగా, సాధుసమర్థనమ్మును ద్వదాజ్ఞాకార్యముల్ దీర్ప సు
క్షమముంజేసి జడమ్ము దీనిఁగొను మత్కర్మేంద్రియవ్రాతమున్. 10

మ॥ ఇది ద్రాక్షాజనితమ్ము, మాధ్వియిది; యాహింతాలజంబిద్ది; యి
య్యది ఖర్జూరజ, మిద్దియిక్షురస, మేదైనం గ్రహింపంగనౌ
నదికాక్కండు రుచింపదేనిఁ గొను ప్రేమన్ మున్ను శ్రీమోహినీ
యుదితాహస్తగమై తనర్చిన సుధాపూర్ణైక భృంగారమున్. 11

శ్లో॥ రత్నాకరప్రియసుతే! బహవశ్చ సంతి
వాహాస్తు తత్ర దుహితావసరే గృహీతాః
హంసః ప్రసన్న నళినీవన ఖేలనోత్కః
కృత్వా మనోపి వశగః ప్రసభం జవేన. 12

శ్లో॥ ఆస్తే సుధాబ్ధిభవనా న్నిజరాజధాన్యాం
యస్సంచరన్ స్వజనసద్మని లీలయైనం
వస్తుం త్వదీయసవిధే బహుధోచితత్వాత్
దత్తంవిహర్తు మురరీకురు లోకమాతః. 13

శ్లో॥ స్వయం శ్రీదేవీ త్వం పతి రఖిలభర్తా జనయితా
నిధానం రత్నానాం భగవతి! కిమర్ప్యం ప్రణిధినా
మనస్తే మన్యేహం హ్యాతమివ విలోలాక్షి! హరిణా
మదీయం విన్యస్తం హృదయ మిదమంగీకురుతతః. 14

శ్లో॥ నజానేవేదాంతా న్నచనిగమ తంత్రాణి పరమే
నకావ్యానాం నవ్యా నిభృతరసభవ్యాశ్చ భణితీః
మయావాచాలత్వం కృతమితి యదేత త్తవశివే
ప్రసాదీభూతాయా వదనగతవీట్యాః పరిమళః. 15

శ్లో॥ అసౌబాలః కశ్చి న్నమచరణ సంవేశితశిరా
మదైవ వాయం దీన స్సతత మవనీయోస్తి తనయః
నవిస్మర్తవ్యోసా వితి సదయభావ స్తవహృది
ప్రసన్నేకర్తవ్యః ప్రతిపద మపీయం మమస్తుతిః. 16

ఇతి పూజాకుసుమమ్.